శ్రీరస్తు.

శ్రీగురుభ్యోనమః

# పరబ్రహ్మవిలాసము.

ఈగ్రంథము గోదావరీ తీరంబున శ్రీరామలింగ క్షేత్రంబైన ఆచంట పురంబున నవతరించిన శ్రీగవరాజా సూర్యనారాయణ పరబ్రహ్మముచే స్వయం విరచితమై భగవత్ప్రీతి గా ప్రకటింపబడుచున్నది.

మొదటికూర్పు 500.



కాకినాడలో
జాతీయముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది.

ఈగ్రంథరాజము మిక్కిలిసారవంతమై సార్థకనామములో నుద్భవించుటవలన లోకంబున మోక్ష గ్రంథములకు శిఖామణి యనబడుచున్నది గనుక ఇంతమూల్యగ్రంథమునకు విలువలేకున్నను దీనికివెల-మూల్యము స్వల్పప్రాయము నేర్పరచబడినది.

వెల రు 1—0—0.

1920.

# ఉపోద్ఘాతము.

—o—

ఇమ్మహేంద్రజాల మాయాకల్పిత బ్రహ్మాండ కటాహంబైన ఈజగన్నాటకము అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడైన పరబ్రహ్మమునకు విలాసార్థమై వినోదింపబడుటవలన జగన్నాటక విలాసము పరబ్రహ్మవిలాసమని చెప్పబడుచున్నది. ఈజగన్నాటకశాలయందు యెనుబదినాలుగులక్షల జీవయంత్రము లుద్భవించి అనేకప్రజ్ఞావిశేషంబుల విచిత్రరూపంబులై నటించుచున్నవి. ఇట్లు వినోదించుచున్న చర్మప్రతిమంబులలో వివేకవంతమైన మానవజన్మము శ్రేష్ఠమైయున్నది. పరనారాయణ స్వరూపంబైన యీ మానవజన్మము లభించినప్పుడే పరబ్రహ్మవిలాసమునుగ్రహించిజీవన్ముక్తినొందవలసియున్నది. ఇట్టిమానవకోటిలో నాస్తికుడు ఇహలోకకామి పరలోకకామి నిష్కామి ముముక్షువు అభ్యాసి ఆరూఢుడు అని సప్తవిధమాం బద్ధభేదములు గలిగియుం

డును; ఇట్టిమానవజన్మములో నాస్తికుడుగాక ఇహ
లోకభోగములనుగోరక నిష్కాములై ఆత్మాతుర
ముముక్షత్వము గలిగి బ్రహ్మవిద్యనభ్యసించి వర
బ్రహ్మవిలాసమును గ్రహించినవారె సంపూర్ణ
వివేకులని చెప్పబడుచున్నది. కాబట్టి లోకంబున
వివేకవైరాగ్య సంపూర్ణులయిన బుద్ధిమంతులు
యీ మోక్షగ్రంథమునందు వివరించిన జగత్సృష్టి
వైచిత్ర్యమును, బ్రహ్మవిద్యాప్రభావమును,
మోక్షసామ్రాజ్య వైభవమును గ్రహించి వర
బ్రహ్మస్వరూపులై బ్రహ్మానందసుఖమనుభవిం
తురుగాక! మోక్షలక్ష్మి నిజభక్తుల నువరించుగాక!



శ్రీ రస్తు.

శ్రీ గురుభ్యోనమః.

# పరబ్రహ్మవిలాసము.

## జీవోత్పత్తిప్రకరణము: జగత్సృష్టివైచిత్ర్యము.

శ్లో. కృష్ణాయ ప్రాణనాథాయ। బుద్ధివృత్తి ప్రదాయినే। నిత్యప్రబోధ పూర్ణాయ। భక్తగమ్యాయతేనమః॥

అనగా ఏపరమాత్మువిశ్వమయుడై ప్రకాశించుచుండునో ఎవడు సర్వప్రాణులను రక్షించుచుండునో యెవడు రామకృష్ణరూపంబుల నవతరించి జగద్గురువై తనస్వరూపజ్ఞానము జీవుల కుపదేశించెనో యెవడుసర్వజీవులకు బుద్ధివృత్తులను గలిగించునో యెవడు నిజభక్తులకు బుద్ధిసాక్షియైగనుపించునో ఎవడు తనభక్తులను తనయందైక్యమునొందించునో అట్టినట్టి శ్రీకృష్ణ

పరబ్రహ్మమూర్తిని ఇష్టదైవముగా ప్రార్థించి యీ గ్రంథప్రారంభము చేయబడుచున్నదని తాత్పర్యము.

శ్లో॥ స్వయంప్రకాశమానాయ। నిర్గుణాయ గుణాత్మనే। సచ్చిదానంద రూపాయ। మహ్యమేవ నమోనమః॥

అనగా అకల్పితస్వయంవ్యక్తమైనఆదిపరబ్రహ్మమొక్కడే ప్రతిశరీరములోను సగుణబ్రహ్మమై నేనునేనని పలుకుచుండుటవలన, ఈదేహధారియైననేను బహ్మవిద్యా ప్రభావమువలన పరబ్రహ్మవిలాసమును గ్రహించి సచ్చిదానంద పరబ్రహ్మము నేనైప్రకాశించుటవలన నిర్గుణపరబ్రహ్మమైన నాస్వరూపమునకు నేనే నమస్కరించి పరబ్రహ్మవిలాసమును ప్రకటించుచున్నాడను.

శ్లో॥ యస్యామిదంకల్పితమింద్రజాలం। చరాచరంభాతి మనోవిలాసం। సచ్చిత్సుఖైకం। జగదేకరూపం। సాకాశికాహం నిజబోధరూపం॥

అనగా ఈచరాచరప్రపంచముసర్వమును పర బ్రహ్మమునందు మాయవలన కల్పితమయియుం ద్రజాలమువలెఉన్నవస్తువులేనట్లును, లేనివస్తువు ఉన్నట్లును అజ్ఞానదృష్టికి మనోరంజకముగా న గుపించుచున్నదో ఏపరబ్రహ్మ మొక్కడే సర్వ ప్రపంచము ద్వారా వెలయుచుండునో జ్ఞానస్వరూ పమయిన యాపరబ్రహ్మమే నేనగుటవలన జగ త్సృష్టివైచిత్ర్యమైన మాయాబ్రహ్మవిలాసమును సగుణబ్రహ్మమై ప్రకటించుచున్నాడను.

శ్లో॥ స్వయంవ్యక్తంస్వయం వ్యాప్తం । స్వ యంజ్యోతిస్స్వయప్రభా। స్వయంవేద్యంస్వయం బోధ్యం । సచ్చిదానందమద్వయం॥

అనగానిర్గుణపరబ్రహ్మమైననేను ఈజగత్సృష్టికి, పూర్వమే కేవల పరంజ్యోతిస్వరూపమైసూర్యునివ లె ప్రకాశింపుచుసర్వత్రవ్యాపించిసర్వపరిపూ ర్ణమై అఖండసచ్చిదానందసముద్రమైయొప్పుచు ఏకరీతిని వెలయుచున్నాడను. అట్టినాయందనాది

మూలప్రకృతికైన అనంతశక్తి సంకల్పరూపమై జనించి అండపిండ బ్రహ్మాండస్వరూపంబైన జీవేశ్వరజగత్తులను గల్పించుచున్నది. జగత్తనగా స్థావరజంగమరూపంబైన వివిధ వినోద నాటకశాల. ఇట్టి జగన్నాటకశాలయందు యెనుబదినాలుగులక్షలు జాతిభేదంబులుగల జీవయంత్రంబులు స్త్రీపురుషరూపంబులై నటించుచున్నవి. అట్టిప్రతిజీవ యంత్రములోను పరబ్రహ్మమైననేనంతర్యామినై అహంస్ఫూర్తి జ్ఞానముచే ప్రకాశించుటవలన జడంబులైన జీవయంత్రములు చలించుచున్నవి. ఇట్లు సర్వజీవ యంత్రంబులలోను పరబ్రహ్మమైననేను ప్రత్యక్షమైనేను నేనని పలుకుచుండినను జగద్భ్రమమైన మాయనన్నావరించుటచేత నేనెవ్వరికిని గనుపించకున్నాడను. అందువలన పరబ్రహ్మవిలాసము బ్రహ్మాదులకైనను తెలియఁబడక మాయావిలాసమని తోచబడుచుండును. ఇట్టిమాయావిలాసమును తెలు

యటకు జగత్సృష్టియందు ఒక జీవయంత్రమును
విచారించిన సర్వజీవయంత్రముల మర్మమును దె
లియబడుచున్నది. జీవయంత్రమనగా పంచభూత
నిర్మితంబైన శరీరంబును, దానియందు పంచప్రా
ణంబులును, దానిలోదశేంద్రియంబులును, అం
దులో అంతఃకరణంబులును, ఒకదానిలో నొకటి
గడియారపు యంత్రంబువలె ఇమిడియుండునది;
అట్టి జీవయంత్రములో అఖండవ్యక్తియైన పర
మాత్మ అంతర్యామియై ప్రకాశించునది పిపీలి
కాదిబ్రహ్మపర్యంతము సర్వజీవయంత్రంబులు
ను ఇదేప్రకారము సృజింపబడుచుండును. ఇట్లు
సృజింపబడిన జీవజంతువులలో గొప్పదైన గజం
బునకు శరీరంబు స్థూలంబగుటవలన ఇంద్రి
యంబులును, ప్రాణంబులును, అంతఃకరణం
బులును, అంతర్యామియును ఒకదానిలో నొ
కటి ఇమిడియుండుట ఆశ్చర్యముకాదు. అతిసూ
క్ష్మమైన జీవజంతువునకు దేహమే అణుమాత్ర

మైనచో ఆ దేహమందు పంచప్రాణంబు లిమిడి యుండుటయెంతచిత్రము! దానిలోదశేంద్రియం బులమరియుండుటయెంతవిచిత్రము! అందులో అంతఃకరణంబులణగి యుండుట యెంతాశ్చర్య ము!ఇన్నింటితో నంతర్యామియైపరమాత్మ ప్ర కాశించుటఎంతదద్భుతము! ఇట్లుస్థూలసూక్ష్మరూ పంబులైన జీవయంత్రంబులలో ప్రాణేంద్రియాం తఃకరణంబులను అతిచాతుర్యముగా నమరించి జగదింద్రజాలము నాడించుచున్న నాయనంతశ క్తిమహాత్వము పరబ్రహ్మమైననాకుదక్క బ్ర హ్మాదులయినను యెరుగజాలరు. ఇట్టిజీవజంతువు లలోపిపీలికమునకు దివ్యజ్ఞానంబును,కుక్కుటము నకుకాలజ్ఞానంబును,భృంగమునకు సృష్టిజ్ఞానము ను,శునకంబునకు పూర్వజ్ఞానంబును,మనుష్యు నకు వివేకజ్ఞానంబును ఇట్లనేక జంతువుల యం దనేకప్రజ్ఞాతత్వంబులు గలిగి యుండినను ప రబ్రహ్మవిలాసమును గ్రహించు .మానవవివే

కళశక్తి నాతనివశీకరింపవచ్చును. ఇట్లుమాయాకల్పితంబులైన సర్వజీవయంత్రంబులలోను పరబ్రహ్మమైననేనొక్కడనే అంతర్యామినై జీవరూపంబున నటించుచున్నానని జగత్సృష్టివైచిత్ర్యమును నేనేయెఱుగుచున్నాడను, గాని జగన్నిర్మాణశక్తియగు నామూలప్రకృతి నన్నెఱుగనేరదు.

మఱియును జీవుండనగా మాయవలనకల్పితమయినవాడా, లేక పరబ్రహ్మమే స్వరూపమయినవాడా అనివిచారించిన.

శ్లో॥ ఏతస్మాత్కిమివేంద్రజాలమపరం। యద్గర్భవాసస్థితం రేతశ్చేతతి హస్తమస్తకపదప్రోద్భూతనానాంకురం। పర్యాయేణశిశుత్వయౌవనజరావేషైరనేకైర్వృతం। పశ్యత్యత్తి శృణోతిజిఘ్రతి తథాగచ్ఛత్యథాగచ్ఛతి॥ అయినట్లు జీవుండను వాఁడు దేహమువలెనే మాయాకల్పితుండైనయెడల దేహముతోనే మృతమయిపోవుటవలన యితనికి పుణ్యపాపంబులును పూర్వోత్తరజన్మంబులును

లేకపోవును. అట్లుగాక అకల్పితస్వయంబ్రహ్మ
మే జీవుడైనయెడల జన్మకర్మంబులు పరబ్రహ్మ
మునకే సంభవించుచున్నవి. గావునజీవసృష్టి
యనగా ఇంద్రజాలకుడుతనమంత్రశక్తివలనలే
నివస్తువును జూపించియున్నవస్తువు అదృశ్యముచే
యునట్లు ప్రకృతిపురుషసంయోగంబున పురు
షవీర్యంబు స్త్రీగర్భంబునప్రవేశించి అండంబై
ఆయండంబు పిండంబై క్రమంబున సర్వాంగంబు
లతో మూర్తీభవించి లోకంబునజన్మించుట
యు అనంతరంబున బాల్యయౌవన కౌమారంబు
లచే విజృంభించి సకలవిద్యలనుగ్రహించి సర్వ
భోగంబులనుభవించి వార్ధక్యంబున యీజీ
వుండు దేహముతో క్షీణించి తుదకు మాయజీవుం
డు మాయదేహముతో మటుమాయమైపోవుటవ
లన, జీవేశ్వరజగత్తులు పరబ్రహ్మమైననాయం
దు మాయవలనకల్పితమని స్పష్టమగుచున్నది.
ఇట్లుమాయాకల్పితమైనప్రతిశరీరములోనునాసం
కల్పశక్తి అహంవృత్తిరూపమైజనించి ఇంద్రియ
ములలోగలసి దేహరూపమై స్త్రీపురుషరూపం
బులచేక్రీడించుచు జగన్నాటకము సల్పుచుండు

ను. ఇట్లుప్రతిదినము నాసంకల్పశక్తి అహంవృత్తి రూపమై స్వప్నముగ జనించి జాగ్రత్తలో వ్యాపించి విషయసుఖంబుల ననుభవించి మరలసుషుప్తిలో నాయందే లయించుచున్నది. ఈప్రకారము నామూలప్రకృతి అహంవృత్తిరూపమై ప్రతిదినము నాయందే జనించిలయించుచుండగా అహంవృత్తికిసాక్షియైననేను జ్ఞప్తిరూపుండనియెరుంగక అహంవృత్తితోగలసి దేహభావంబునజీవభ్రాంతినిపొందుచున్నాడను- ఇవ్విధంబున పరబ్రహ్మమైననేను జీవభ్రాంతిచేఅనేకజన్మంబు లెత్తుచు జననమరణసముద్రంబునమునుగుచున్నానని భ్రమించి కొంతకాలంబునకు బహుపుణ్యవిశేషంబున బ్రహ్మవిద్యలభించి తత్ప్రభావంబున ఈదేహాదిప్రపంచముసర్వము ఇంద్రజాలమువలె నే పరబ్రహ్మమైననాయందు నాసంకల్పశక్తివలననే జనించి లయించుచున్నదనినేనుగ్రహించుచున్నాడను.

ఇట్లుమాయావిలాసంబైన యీజగత్సృష్టివైచిత్రమును గ్రహించిననాకు పరబ్రహ్మవి

లాసమంతయును ప్రత్యక్షముగా గనుపించుచు న్నది.

కాబట్టి లోకంబున సంపూర్ణ వివేకుల యిన ముముక్షువులు ఈజగదింద్రజాలమాయావి లాసమును బ్రహ్మవిద్యాప్రభావంబుచే గ్రహింపవలయునని తాత్పర్యము.

జీవోత్పత్తి ప్రకరణము సమాప్తము.





శ్రీః స్తు

# పరబ్రహ్మవిలాసము:

ఆత్మజ్ఞానప్రకరణము.

బ్రహ్మవిద్యాప్రభావము.

శ్లో॥ స్నాతంతేనసమస్తతీర్థనిచయే దత్తంమ హీమండలం । విప్రేభ్యఃపితృదేవతా స్సురగ ణా స్సర్వేశసంతర్పితాః॥ జప్తామంత్రసహస్రకో టిరమూనా తీవ్రంచ ధాసంతిపో । యస్యబ్ర హ్మవిచారణేషణమపి ప్రాప్నోతి ధైర్యంమనః॥

అనగా దేహధారియైనజీవుండు లోకంబు న సకలపుణ్యతీర్థములయందుస్నానముచేసినను ఈభూమిమండలము దానముచేసినను సకలదేవ తలనుతృప్తిచేసినను సప్తకోటిమహామంత్రముల ను జపించినను ఉగ్రమయినతపస్సుచేసినను ఈ

ణమాత్రములో బ్రహ్మవిచారణచే జీవన్ముక్తినొందుటవలన లోకంబునబ్రహ్మవిద్య సద్యోముక్తిప్రదమైనదనియు బ్రహ్మవిద్యలేకుండిన బ్రహ్మాదులకైనను మోక్షము సిద్ధింపదనియు కల్పవృక్షమువలె జీవులను మోక్షసామ్రాజ్యము నొందించుచున్న బ్రహ్మవిద్యాప్రభావము బ్రహ్మాదులకైనను దెలియశక్యముగాదనియు బ్రహ్మవిద్యాప్రభావమువలననే పరబ్రహ్మవిలాసము తెలియవలసినదనియు తాత్పర్యము.

శ్లో॥ శ్లోకార్ధేన ప్రవక్ష్యామి । యదుక్తం గ్రంథకోటిభిః । బ్రహ్మసత్యం జగన్మిథ్యా । జీవో బ్రహ్మైవ కేవలం॥

అనగా బ్రహ్మవిద్యయందలిసారాంశము విచారించిన జీవుడె బ్రహ్మమని బ్రహ్మమే సత్యమని జగత్తే మాయయని మాయేమిథ్యయని తెలియబడుచున్నది. కనుక దేహధారియైన జీవుండు బ్రహ్మవిద్యయందలిసారాంశములను గ్రహించి ఆత్మజ్ఞానమువలన జీవన్ముక్తి నొందవలెను. అందుకు

ఆత్మజ్ఞానసాధనములైనయీ యాఖ్యాయికలు వి
వరింపబడుచున్నవి.

బ్రహ్మము ప్రకృతి ఈశ్వరుడు జీవుడు కర్మ అకర్మ జ్ఞానము అజ్ఞానము సుఖము దుఃఖము స్వర్గము నరకము బంధము మోక్షము అను యీ ముఖ్యాంశములను పరామర్శించి జీవుని నిజరూపము తెలియబడుచున్నది. అదెట్లంటె.

సత్యము జ్ఞానము ఆనందము యీలక్షణములుగల వస్తువె పరబ్రహ్మమని చెప్పబడుచున్నది.

ఆపరబ్రహ్మముయొక్క సంకల్ప రూపమైయున్న యిచ్ఛాశక్తియె ప్రకృతి.

తనసంకల్పశక్తితోగూడి జగత్తును సృజించి తానంతర్యామియైనప్రకాశించువాడె ఈశ్వరుడు.

అంతర్యామియైన తాను దేహము తానని భ్రమించువాడె జీవుడు.

సర్వాంతర్యామియైన బ్రహ్మము బ్రహ్మ విష్ణు రుద్రుడు యింద్రుడు సూర్యుడు చంద్రుడు యముడు సురలు అసురలు నరులు పిశాచములు పశుపక్షిక్రిమికీటకాదులు సర్వరూపంబులును తానై ప్రకాశించుచున్నాడు.

ఇట్లు దేహధారియైన జీవుడు ఇంద్రియములచే చేయబడు కార్యములు ఆత్మయందారోపించి తానుకర్తనని చేయునదే కర్మ

తానుఅకర్తయై నిష్కామత్వంబున చేయునదే ఆకర్మ

సర్వాంతర్యామియైన బ్రహ్మమే తనస్వరూపమని బ్రహ్మనుభవము బొందియుండునదే ఆత్మజ్ఞానము

ఏకమైనబ్రహ్మమందు నానావిధనామరూపభేదములు కల్పించెడు లోకజ్ఞానమె అజ్ఞానము.

సచ్చిదానందబ్రహ్మమె తనస్వరూపంబని గ్రహించి బ్రహ్మనందమనుభవించునదే మోక్షసుఖము.

పరబ్రహ్మమైన, తనకంటె అన్యమైన సం
సారచింతయేదుఃఖము, సజ్జనగోష్ఠియే స్వర్గము
దారాపుత్రసంసారసంగమైనప్రత్యక్షనరకము
నిస్సంకల్పమైన ఆత్మసంకల్పమే ప్రతిబంధము
సర్వసాక్షియై యేసంకల్పము లేకుండువాడే
మోక్షము.

దేహేంద్రియాదులకంటె విలక్షణ సచ్చిదా
నందనిత్యముక్తమై యున్నబ్రహ్మస్థానమే పరమ
పదము. యిదేజీవులకు విజ్ఞానము.

ఇట్లు విమర్శింపబడిన బ్రహ్మజ్ఞానాంశముల
ను గ్రహించిన జీవుండు బ్రహ్మవిత్ బ్రహ్మైవ
భవతి అనున్యాయంబున బ్రహ్మము తానైనం
దున

శ్లో॥ సంకల్పమాత్రకలనేనజగత్సమగ్రం సం
కల్పమాత్రకలనేనజగద్విలాసః। సంకల్పమాత్ర
మిదముత్సృజనిర్వికల్ప । మాశ్రిత్యమామక
పదంపరిపాలయామి.

అనినట్లు పరబ్రహ్మమైన నాసంకల్పమువల

వనే జగత్సృష్టియు నాసంయోగమువలనజగద్వి
లాసము, నావియోగమువలన జగత్ప్రళయమును
నాయందెజరుగుచున్నవని స్పష్టపడినందున జగ
త్కల్పనాశక్తియైన నామూలప్రకృతి నింతటి
తో విసర్జించి మోక్షసామ్రాజ్యపట్టాభిషిక్తుం
డనై పరబ్రహ్మ విలాసంబైన మోక్షసామ్రా
జ్యవైభవంబనుభవింపుచు బ్రహ్మవిద్యాప్రభా
వంబును వర్ణింపుచూ ఆత్మజ్ఞానమును ధృఢప
రచుకొనుచున్నాను.

శ్లో॥ నాహంమనుష్యో నచదేవయక్షో నబ్రా
హ్మణక్షత్రియవైశ్య శూద్రాః నబ్రహ్మచారీన
గృహీ వనస్థోభిక్షుర్నచాహం నిజబోధరూపః
అనగా యీబ్రహ్మవిద్యా ప్రభావమువలన నా
స్వరూపజ్ఞానము నాకు గలిగినందున దేహధారి
నైన నేను కేవలజ్ఞానస్వరూపుడనుగాని దేవతను
మనుష్యుడను బ్రాహ్మణుడను క్షత్రియుడను
బ్రహ్మచారిని గృహస్థుడను మొదలైన మా
యాకల్పితనామరూపములు గలవాడను గానం

మున నానిజస్వరూపమును ఆత్మబోధచే మరల నేను విమర్శించుచున్నాడను.

శ్రుతి॥ తమేవభాన్తమనుభాతిసర్వం తస్యభాసా, సర్వమిదంవిభాతి అనగాయీనామరూప ప్రపంచము యేపరంజ్యోతిప్రకాశమువలన తెలియబడుచున్నదో యేపరంజ్యోతిస్వరూపము సర్వభూతముల కంతర్యామియై వెలుగుచున్నదో ఆపరంజ్యోతియె పరబ్రహ్మమని ఆపరబ్రహ్మమె నాస్వరూపమని నిశ్చయించి నాస్వరూపమునుబోధచేతను గ్రహించుచున్నాడను ఏసచ్చిదానందపరబ్రహ్మము జగద్రూపమైయుండెనో యేసచ్చిదానందవిగ్రహుడు ప్రతిజీవయంత్రములోనుండి నేను నేనని పలుకుచుండునో ఆబ్రహ్మమెనేను.

పిపీలికాదిబ్రహ్మపర్యంతముగలసర్వజీవయంత్రములను ఏసూత్రాత్మ నడపించుచుండునో ఆజగత్సాక్షియెనేను.

ఏవడుసర్వజ్ఞుడో సర్వస్వరూపుడో ప్రకృతి

పురుషస్వరూపుడో ఆనందమయుడో అనంత
సుగుణములుగలవాడో మాయోపాధికుడో యిం
ద్రియముల కగోచరుడో భోగ్యభోక్తృ స్వరూ
పుడో అట్టి పరిపూర్ణుడనే నేను.

ఏవస్తువుకంటె వేరైనవస్తువులేదో యెవడు
జగద్రూపుడయినను తానుసాక్షియై విలక్షణ
ముగానుండునో యెవడు యింద్రియవిషయము
లకంటె వేరైనజ్ఞానస్వరూపుడో అట్టి సర్వజ్ఞుడ
నే నేను.

ఏకాంతభక్తులైన అంతర్ముఖులు యేపర
మాత్ముని తమహృదయమందునిల్పుకొని నిరం
తరము భక్తిప్రపత్తులతో సేవింపుచుపులకాంకిత
శరీరులై తనువుమరచి తన్మయత్వముజెందుచు
న్నారో ఆ పరమాత్మనె నేను.

శ్లో॥ అజ్ఞానాదేవసంసారో। జ్ఞానాదేవ విము
చ్యతే। జ్ఞానస్వరూపమేవాదా। జ్ఞానంజ్ఞేయైక
సాధనం జ్ఞాతంయేననిజంరూపం కైవల్యం పర
మంపదంఅనగా ఈదేహధారియైన జీవుండును

ట్లు ఆత్మజ్ఞానమువలన జననమరణ సంసారమును విడచి పరబ్రహ్మమైన తననిజరూపమును గ్రహించునదే పరమపద విదేహకైవల్యమని తాత్పర్యము.

## ఆత్మజ్ఞానప్రకరణము.

సమాప్తము.

---



శ్రీరస్తు.

# పరబ్రహ్మవిలాసము.

## జీవన్ముక్తి ప్రకరణము.

### మోక్షసామ్రాజ్యవైభవము.

లోకంబున మానవకోటిలో నూఱుకోట్లకొ కానొకడు అనంతకోటిజన్మముల పుణ్యవిశేషంబున ఈశ్వరానుగ్రహ బలంబున మోక్షాసక్తుడగుచుండును. అట్టివాడు సర్వవిషయాశాసముద్రమును హనుమంతునివలె అనాయాసంబున తరించి శుద్ధాత్ముడై అఖండానందైకరసంబైన తన ఆత్మను సచ్చిదానందపరబ్రహ్మమని దర్శించుచున్నాడు అదియే మోక్షసామ్రాజ్యమహాలక్ష్మీవైభవంబని చెప్పబడును లోకంబున సకలసామ్రాజ్యవైభవంబులలోను మోక్షసామ్రాజ్యవైభవంబు ఉత్తమమైనది.

బ్రహ్మాదిదేవతలకైననూ మోక్షసామ్రాజ్య
వైభవంబుమహాదుర్లభంబు ఎంతవిజ్ఞానవంతుల
కైనను మోక్ష శ్రీకటాక్షంబు గలుగనేరదు
సాధనసంపన్నులై సర్వభోగసంతుష్టులైన సర్వ
సంగపరిత్యాగులనుగాని మోక్షలక్ష్మివరించనేర
దు బ్రహ్మవిద్యాస్వరూపిణియయిన ముక్తికాంత
తో ననుభవించువాడు కేవల పరబ్రహ్మమూర్తి
గాని అవిద్యా పరవశుండైన జీవుండు గాడు.
అట్టిమహాత్ములకు పునరావృత్తిరహితశాశ్వతవి
దేహకైవల్యముతమదేహమందే సిద్ధించుచు
న్నది.

జీవన్ముక్తియనగా ఈదేహస్థమైన ఆత్మయే
అశరీరమైన పరబ్రహ్మమనియు ఆపరబ్రహ్మ
మే ఆత్మయనియుతత్త్వవిచారణచేసమరసైక్యము
నెరిగి సకలసంకల్పములనువిడచి సర్వప్రపంచము
మరచి సర్వము తానైయున్న వస్తువు తానై కేవల
సాక్షిమాత్రమైయుండునదే జీవన్ముక్తియనబడు
ను. అట్టిజీవన్ముక్తుడు అమృతపానముచే తృప్తి

నాంది నట్లు ఆత్మజ్ఞానామృతపానపరవశంబున నే ర్వమును మరచి సదానంద స్వరూపుడై సుఖం చును.

శ్లో॥ మోక్షసాధనసామగ్ర్యాం॥ భక్తిరేవగరీయ
సీ॥ స్వస్వరూపానుసంధానం। భక్తిరిత్యభిధీ
యతే॥

శ్లో॥ వైరాగ్యతైలసంపూర్ణే భక్తివర్తి సమ
న్వితే। ప్రబోధపూర్ణపాత్రేణ జ్ఞప్తిదీపం
విలోకయేత్॥

అనగా దేహధారియైన జీవునకు బ్రహ్మము తానని పరోక్షజ్ఞానము బ్రహ్మబోధవలన గలిగి నను ఏకాంతభక్తి వలననుగాని బ్రహ్మానుభవము గలుగ నందున ఏకాంతభక్తి వలన జీవన్ముక్తి ని పొందవలసియున్నది. అట్టిజీవన్ముక్తికొరకు ఆత్మబోధయను పాత్రమునందు స్థిరవైరాగ్యమను తైలముంచి యేకాంతభక్తియను వత్తియమర్చి స్వరూపజ్ఞానమను జ్యోతిని వెలిగించి ఆపరంజ్యోతిని తానుగా దర్శింపవలెనని తాత్పర్యము.

శ్లో॥ సామ్రాజ్యంభోజ్యం। స్వాత్మరాజే న ఖేచరమే॥ అనగా స్వస్వీకవైరాగ్య సంపన్నుడైన పూర్ణాధికారి స్వారాజ్యాభిషిక్తుండై బ్రహ్మానందరతిక్రీడా వినోదంబున తనముక్తికాంతతో సంభోగించునదే మోక్షసామ్రాజ్యమహాలక్ష్మీకటాక్షనిత్యమంగళ మహావైభవంబని తాత్పర్యము.

శ్లో॥ యల్లాభాన్నాపరోలాభః। యత్సుఖాన్నాపరంసుఖం యద్జ్ఞాత్వానాపరంజ్ఞానం తద్బ్రహ్మేత్యవధారయ

అనగాలోకంబున ముముక్షువులకు ఏ మోక్షలాభమును పొందినపిమ్మట అధికమైన లాభమును పొందినపిమ్మట అధికమైనలాభము లేదో, ఏమోక్షసుఖమును పొందినపిమ్మట అధికమైన సుఖము లేదో, ఏవస్తువును తెలిసినపిమ్మట తెలియదగినవస్తువు లేదో అదే తానైనబ్రహ్మవస్తువని బ్రహ్మవిద్యాప్రభావమువలన నాకు తెలియబడినందున పరబ్రహ్మవిలాససంబంధి నా మోక్షసామ్రాజ్యవైభవంబును లోకంబున

నిజభక్తులకు సులభముగా తెలియబడునట్లు పర బ్రహ్మమైన నేను అశరీరుండనయ్యును ఘూశ రీరంబులోఁగూడి పరబ్రహ్మ రహస్యమంతయును ప్రకటించుచున్నాడను.

శ్లో॥ అహంనిర్వికల్పో । నిరాకారరూపీవిభు త్వాచ్చ । సర్వత్రస ర్వేంద్రియాణాం । న చాసంగతం । నైవముక్తిర్నజన్మ । చిదానం దరూప । శ్శివోహం శివోహం మోతుసా మ్రాజ్యమనగా ఈజగత్సృష్టికి పూర్వము పర బ్రహ్మమైననేను దేహేంద్రియప్రాణాంతః కర ణంబులు లేనివాడనై అఖండసచ్చిదానంద సము ద్రమై నిర్వికల్ప నిస్సంకల్పస్థితియందుండునదని యర్థము. అట్లుసచ్చిదానందస్వరూపమై వెల యుచున్న నా యందు అనాదిమూలప్రకృతి యను చిచ్ఛక్తి అహంవృత్తిరూపమైజనించి నా సాన్నిధ్యబలంబున ఈదేహాదిప్రపంచమును క ల్పించుటవలన జ్ఞానాజ్ఞానరహితమైన నేను చి దాకాశస్వరూపమై ప్రతిశరీరములోను ఘటాకా శమువలె చిక్కుబడుచున్నాడను. అట్టిమాయా

కల్పితమైన స్థూల సూక్ష్మదేహంబులలో సర్వ
మాకాశమైయున్న నన్ను నాసంకల్పశక్తి ఆవ
రణవిక్షేపరూపమై ఇచ్ఛలేనివానికి విషయేచ్ఛ
యును జ్ఞానములేనివానికి విషయజ్ఞానమును అను
భవములేనివానికి విషయానుభవమును గలిగించి
నాస్వరూపస్మృతిని మరపించి దేహమునేనని
తోపించుచున్నది. అందువలన నిర్వికారపర
బ్రహ్మమైన నాకు జననమరణజీవభ్రాంతి సంభ
వించుచున్నవి. అట్లుసంభవించిన అజ్ఞానజీవ
భ్రాంతి ఇట్లు బ్రహ్మవిద్యాప్రభావమువలన ని
వర్తించునదే మోక్షసామ్రాజ్యము ఇట్లుపర
బ్రహ్మమైన నేను ఘటాకాశమువలె ప్రతిశరీర
ములోనంటియుండి దేనినంటకుండినను నాసంక
ల్పశక్తియైన అహంవృత్తితోగూడి। పరాపశ్యం
తి। మధ్యమవైఖరీ వాక్కులచే శబ్దబ్రహ్మమై
నేను నేనని పలుకుచున్నాను. ఇట్లునేనని పలుకు
చున్నవస్తువును విచారించిన నిశ్శబ్దబ్రహ్మమైన
నాయందు సంకల్పశక్తివలన వాగింద్రియద్వా
రా నేనను శబ్దము పలుకుచున్నదిగాని జడమైన
దేహములేకున్నను అహంశక్తియైన సంకల్పము

లేకున్నను నేనను శబ్దమేకలుగనేరదు అందుకు సుషుప్తియే నిదర్శనము గనుక నిర్గుణబ్రహ్మమైన నేనుండుటచేతనే జడంబులైన బుద్ధీంద్రియంబులు చలించుచున్నవిగాని సర్వేంద్రియములకు సాక్షియైన నేనెప్పుడును చలించుటలేదు జాగ్రన్నిద్రలే జననమరణంబులై ప్రతిదినము సృష్టిప్రళయంబులు నాయందు నాసంకల్పశక్తి వలన గలుగుచున్నవి క్షణప్రళయము మొదలు తనుప్రళయమువరకు సర్వసాక్షినై నేనొక్కడనే నిలిచియున్నాను. కాబట్టి నాసంకల్పశక్తియైన మూలప్రకృతియే జగద్రూపమై జనించునది జీవించునది చలించునది గ్రహించునది అనుభవించునది కృశించునది నశించునదిగాని పరమాత్మస్వరూపంబయిన నేనేమియును ఎప్పుడునుచేయుటలేదు దేనిని పొందుటలేదు. అన్నిటిని నేన ఎరుగుచున్నాడనుగాని నన్నదియునుఎరుగనేరదు. సముద్రతరంగములవలె సర్వము నాయందు జనించి లయించుచున్నది. గాని నేనెప్పుడును జనించువాడనుగాను అనంతకోటిబ్రహ్మాండములు నాయందు జనించుటవలన అఖిలాండకోటి బ్ర

బ్రహ్మాండనాయకుడని వేదంబులువరబ్రహ్మమైన నన్నుస్తుతింపుచున్నవిగాని వేదంబులునన్నురుగనే రవు నన్నురుంగు...నేనే సర్వముసెరిగినవా డను నేనే పరబ్రహ్మమైన ...కంటె మాయగాని మాయాకల్పిత జీవేశ్వరజగత్తులుగాని ఎప్పుడు ...లేవు ఇట్లు పరబ్రహ్మవిలాసమునుగ్రహించి నవాడే జీవన్ముక్తుడని తాత్పర్యము.

జీవన్ముక్తి ప్రకరణము

సమాప్తము.

---

గద్యము.

ఇతి శ్రీరామచంద్ర ఇష్టదేవ తాప్రసాద లబ్ధంబునను శ్రీలక్ష్మీనృసింహసద్గురు ప్రబోధంబున శ్రీసూర్యనారా యణశర్మణా విరచితంబును పరబ్రహ్మవిలాసం సంపూర్ణము.

## తత్వకీర్తన - రాగము - కాఫి.

తమాషగాడె తారకబ్రహ్మము తానేజీవుండా యెగదా। జీవుడు తానై। దేవుడు తానై। జగన్నాటకము సల్పుగదా ।త।

అండపిండబ్రహ్మాండములోపల। అఖండతేజస్సైయుండెగదా। అఖండతేజస్సై అణురూపములో అంతర్యామిగ నుండెగదా ।త।

పరమపురుషుడే ప్రకృతిపురుషులై। సతిపతిక్రీడలు సల్పెగదా। సతిపతిన్యాయము సలుపుచుజీవుడు। సంసారములోజిక్కెగదా ।త।

ఆలుమగడు సంసారముజేయుచు।
ఆత్మరూపమును మరచెగదా।
ఆత్మానాత్మవివేకముగలిగిన।
జీవుడు దేవుండాయెగదా ।త।

సూత్రధారి తానొక్కడెజగమున వేషధారుడై వెలసెగదా। వేషభాషలను విసికివిసికి। దేవుడుతానని దెలసెగదా ।త।

నిర్వికారచైతన్యము। నీవని సూర్యదాసునకు దెల్పెగదా। సూర్యదాసుడె బ్రహ్మముతానై స్వప్రకాశమును జెందెగదా ।త।

రెండవకీర్తన.

దేహమందేచూడరా హరి దేవుడుండువా న్నాడురా। తన్నుతానెఱుగంగనేర్చిన తానదేవుండవునురా ॥దే॥

1 దేహిదేహము రెండురా హరి దేహియే దేవుండురా। దేహమే తాననుచుభ్రమసి। దేహిజీవుండవునురా ॥దే॥

2 ప్రకృతిపురుషులు రెండురా హరి పురుషుడే దేవుండురా। ప్రకృతితోడను గూడిపురుషుడు పుట్టిగిట్టుచునుండురా ॥దే॥

3 వృత్తిజ్ఞప్తులు రెండురా హరి జ్ఞప్తియేదేవుండురా। వృత్తిరూపుండైన పురుషుడు। మృత్యువుచేబడుచుండురా॥దే॥

4 శివుడుజీవుడు రెండురా హరి శివుడు దేవుండవునురా। శివుడుతానని తెలియనేరక శివుడుజీవుండవునురా ॥దే॥

5 ఎఱుకమఱపులు రెండురా హరి ఎఱుకయే దేవుండురా। మఱపుమాయని తెలియనేరక ఎఱుకమఱచియుండురా ॥దే॥

శ్రీ

6 విశ్వమేతనమాయరా హరి విశ్వమయు
డైనాడురా సాక్షి కావని తెలిసినంతనె స్వయం
బ్రిహ్మంబవునురా ।దే।

7 నిర్వికారగుడు కానురా హరి నిత్యముక్తుం
డౌనురా। సూర్యుడుడు ముక్తినొందిన। సూ
త్రిమిదియని డెలియరా ।దే।



గురుభ్యోనమః

# శ్రీరామమానసపూజ

సుతీక్ష్ణ ఉవాచ !

శ్లో॥ హృదయే మానసీపూజా కీదృశీ వా త
దప్రభో। ఉపచారైః కతివిధైః॥ పూజ్యతే రఘు
నందనః॥ అగస్త్య ఉవాచ । రామం పద్మపలా
శాక్షం। కాలాంబుదసమప్రభం , స్మితవక్త్రం
సుఖాసీనం। చింతయే చ్ఛాంతి తాపహే॥ రాగా
దికలుషం చిత్తం, వైరాగ్యేణ సునిర్మలం।
కృత్వాధ్యాయే త్సదా రామం । భవబాధ విము
క్తయే॥ ప్రాతః శుద్ధతనుర్భూత్వా। శౌచాదిభి
రతంద్రితః॥ వివిక్త దేశమాశ్రిత్య । ధ్యానపూ
జాం సమాచరేత్ ॥ శుద్ధేన మనసా రామం
పూజయేత్సతతం హృది । ఆవాహయామి విశ్వే
శం । జానకీవల్లభం విభుం॥ కౌసల్యా తనయం
విష్ణుం! శ్రీరామం ప్రకృతేః పరం । రాజాధి
రాజ రాజేంద్ర। రామచంద్ర మహీపతే।రత్న
సింహాసనం తుభ్యందాస్యామి స్వీకురుప్రభో
శ్రీరామాగచ్ఛ భగవన్। రఘువీర నృపోత్తమ।

జానక్యా సహ రాజేంద్ర । సుస్థిరో భవ సర్వదా॥
రామచంద్ర మహేష్వాస। రావణాంతక రాఘ
వ । యావత్పూజాం సమాప్స్యేవ । తావత్త్వం సన్ని
ధౌ భవ॥ రఘునందన రాజర్షే । నమో రాజీవ
లోచన । రఘునందన మే దేవం , శ్రీరామాభి
ముఖో భవా॥ ప్రసీద జానకీనాథ । సుప్రసీద సురే
శ్వర । ప్రసన్నో భవ మే రాజన్ । ప్రసీద మధు
సూదన॥ శరణం మే జగన్నాథ । శరణం భక్త
వత్సల । వరదో భవ మే రాజన్ । శరణం మే ర
ఘూత్తమా॥ పరిపూర్ణ పరానంద । నమో రామా
య విష్ణవే। గృహాణార్ఘ్యం మయా దత్తం । కృష్ణ
విష్ణో జనార్దన ॥ త్రైలోక్య వ్యాపకానంత। న
మస్తే రఘునాయక । పాద్యం గృహాణ రాజర్షే ।
నమో రాజీవలోచన ॥ ఓం నమో వాసుదే
వాయ । తత్వజ్ఞానస్వరూపిణే ॥ మధుపర్కం
గృహాణేదం ॥ రాజరాజాయ తే నమః ॥
ఓం నమస్సత్యాయ శుద్ధాయ। బుద్ధాయ జ్ఞానరూ
పిణే । గృహాణాచమనం నాథ । సర్వలోకైకనా
యక ॥ బ్రహ్మాండోదరమధ్యస్థ । తీర్థరాయిశ్చ
రఘునాయక । స్నానయిష్యామ్యహం భక్త్యా ।

సంగృహాణజనదర్శనా। సంతప్తకాంచనపరిఖ్యం।
పీతాంబరమిదంహరే। సంగృహాణ జగన్నాథ।
రామచంద్రనమోస్తుతే॥ కుంకుమాగరుకస్తూరీ।
కర్పూరోన్మిశ్రిచందనం। తుభ్యందాస్యామి వి
శ్వేశ। శ్రీరామస్వీకురుష్వభో॥ తులసీకుంద మం
దార। జాజీపున్నాగచంపకైః। కదంబకరవీరా
ది। కుసుమైశ్శతపత్రకైః॥ నీలాంబుజై ర్బిల్వద
ళైః పుష్పమాల్యైశ్చరాఘవ। పూజయిష్యా
మ్యహంభక్త్యా।సంగృహాణమహేశ్వర॥ వనస్ప
తిరసైర్దివ్యైః। గంధాఢ్యైస్సుమనోహరైః।
రామచంద్ర మహీపాల। ధూపోయంప్రతిగృ
హ్యతాం॥ జ్యోతిషాంపతయే తుభ్యం। నమోరా
మాయశార్ఙ్గిణే। గృహాణ దీపకంరాజన్। త్రై
యిలోక్యతిమిరాపహం॥ఇదందివ్యాన్నమమృతం।
రసైష్షడ్భిస్సమన్వితం। శ్రీరామరామరాజేంద్ర
నైవేద్యంప్రతిగృహ్యతాం। నాగవల్లీ దళై
ర్యుక్తం। పూగీఫల సమన్వితం। తాంబూ
లం గృహ్యతాంరామ।కర్పూరాదిసువాసితం।
రాజేంద్ర రామసర్వజ్ఞ। రఘువీరనృపోత్తమ।
నృత్తగీతాదివాద్యైశ్చ। పురాణపఠనాదిభిః।

రాజోపచారై రఖిలై । స్సంతుష్టో భవరాఘవ ॥
నమస్తే జానకీనాథ । రామచంద్ర నమోస్తుతే ।
ఓం నమో భగవతే శ్రీ । రామాయ పరమా
త్మనే । సర్వభూతాంతరస్థాయ । ససీతాయన
మో నమః ॥ ఓం నమో భగవతే శ్రీ । రా
మచంద్రాయ వేధసే । సర్వవేదాంత వేద్యాయ ।
ససీతాయ నమో నమః ॥ ఓం నమో భగవతే । వి
ష్ణవే పరమాత్మనే । పరాత్పరాయ రామాయ । స
సీతాయ నమో నమః ॥ ఓం నమో భగవతే
శ్రీరామాయామిత తేజసే । బ్రహ్మానందైక రూ
పాయ ససీతాయ నమో నమః ॥ పూర్ణానందైక
రూపేణ । గృహాణార్ఘ్యం నమోస్తుతే । మం
గళార్థం మహీపాల । నీరాజనమిదం హరే ।
సంగృహాణ జగన్నాథ రామచంద్ర మహీపతే ॥
విశుద్ధజ్ఞాన రూపాయ । నమో రామాయ శార్ఙ్గిణే ।
అంతఃకరణసంసిద్ధిం । దేహిమే రఘువల్లభ ॥ కృష్ణా
య వాసుదేవాయ । హరయే పరమాత్మనే । ప్రణ
తక్లేశ నాశాయ । గోవిందాయ నమో నమః ॥
ఇతి శ్రీ బ్రహ్మాండపురాణే శ్రీరామ మానసపూ
జా శ్రీకృష్ణార్పణమస్తు.

# శుకరంభసంవాదము.

శ్లో॥ రంభోవాచ:— సుగంధై స్సుపుష్పై
స్సుశయ్యా సుకాంతా। వసంతే ఋతుః పూర్ణిమా
పూర్ణచంద్రః। యువా వాస్తి పుంస్త్వం నరస్య ప్ర
భూతం। తతః కిం తతః కిం తతః కిం తతః కిం॥

తా॥ అనగా లోకంబున మానవజన్మము లభిం
చినందుకు పురుషుడు వసంతఋతుకాలంబున
సంపూర్ణ చంద్రోదయ సమయంబున సుగంధ
పుష్పశయ్యాతల్పంబున అత్యంత సౌందర్యకా
మినీసంభోగంబు చేసి రతిక్రీడాసుఖంబనుభ
వించకున్న వాని పురుషత్వము నిరర్థకమని వ
రబ్రహ్మ శక్తియైన మూలమాయ కామినీరూ
పంబై శుకయోగిసాన్నిధ్యంబున కేతెంచి
అతనిని మోహింపచేసి భంగపరచుటకై ఇట్లు
పలుకుచున్నదని తాత్పర్యము.

శ్లో॥ శుకోవాచ:— మహాశయ్యాపృథ్వీః విపు
లముపధానం భుజలతా। వితానంచాకాశం
వ్యజన మనుకూలోయమనిలః। శరచ్చంద్రో

పురుషునకు మన్మధునివంటి దేహమున్ను, రంభ వంటి భార్యయున్ను, కాళిదాసు వంటి కవిత్వ మున్ను, కుబేరునివంటి ధనమున్ను, కలిగ యుండినను జగద్రక్షకుడైన శ్రీహరియందు చిత్తములయింపకుండిన ఆపురుషుని జన్మము నిర ర్థకమని తాత్పర్యము.

4. శ్లో॥ నారాయణః పంకజలోచన ప్రభుః। కేయూరవాన్ కుండలమండితాననః। భక్త్యాస్ఫు తోయేన సమాశ్రితో నో। వృధాగతం తస్యనరస్యజీ వితం॥ 5. శ్లో॥ చతుర్భుజశ్చక్రధరో గదాయుధః। పీతాంబరః కౌస్తుభమాలయాలసన్। ధ్యానేధృ తోయేన నబోధకాలే। వృధాగతంతస్య నర స్యజీవితం॥ 6. శ్లో॥ అచింత్యరూపో భగవన్ నిరంజనో। విశ్వంభరో జ్ఞానమయః పరాత్మా। విశోకితోయేన హృదిక్షణంనో। వృధాగతం తస్యనరస్యజీవితం॥ 7. శ్లో॥ విశ్వంభరో జ్ఞాన మయః పరేశో। జగన్మయోనంత గుణప్రకాశీ। ఆరాధితోయేన ధృతోనయోగే। వృధాగతం తస్యనరస్యజీవితం॥ 8. ఆనందరూపో నిజబోధ రూపో। దివ్యస్వరూపో బహునామరూపః॥ తపస

మాధ్వాకలితో నయేన । వృథాగతం తస్యనరస్య జీవితం॥

ఓ దేవీ! పరబ్రహ్మ శక్తివైన నీవు అనంత శక్తివై ప్రపంచమును కల్పించి ప్రతిజీవయంత్రములోను బుద్ధిరూపవై, వృత్తిరూపవై, కామరూపవై, నిద్రారూపవై, మృత్యురూపవై, విద్యారూపవై, జగన్నాటకమాడించుచున్నావు. నీకనంత వందనములు వందనములు. మోక్షలక్ష్మివై నన్ను రక్షింపుము రక్షింపుము.

ఇట్లు శుకయోగి ప్రత్యుత్తరంబు లిచ్చిన విశ్వమోహినియైన మాయకాంత అతని బ్రహ్మజ్ఞానంబునకు మిక్కిలినంతసించి నిర్మోహుండవైన నిన్ను వరించితినని తన కామినీరూపంబువదలి చిచ్ఛక్తిస్వరూపంబై శుకయోగీంద్రుని హృదయంబున ప్రవేశించి ముక్తికాంతయై పరబ్రహ్మముతో రమించుచున్నదని తాత్పర్యము.

---

